# నేస్తం

రచన
**కడిమిళ్ళ రమేష్**
అరబిందో ఫార్మా
హైదరాబాద్
చరవాణి.9290128346

ప్రతులు 1000

ప్రచురణకాలం 2013

ప్రతులకు
**కడిమిళ్ళ శ్రీవిరించి**
3.6.50
యళ్ళమిల్లివారి వీథి
నరసాపురం. 534275
పశ్చిమగోదావరిజిల్లా
చారవాణి 9247879606

ముద్రణ
**సాయితేజ ఆఫ్‌సెట్ ప్రింటర్స్**
మెయిన్‌రోడ్, నరసాపురం. 534275
సెల్. 9346633812, 9247347626

# ఒకమాట

నేను కవిత్వాన్ని ప్రేమిస్తాను ప్రక్రియను కాదు. ఇది నా మాటకాదు మా నాన్నగారు గురుసహస్రావధాని డా కడిమిళ్ళ వరప్రసాద్ పలుకు. అది నామనసులో బాగా నాటుకుంది. నాన్నగారు పద్యమే ఊపిరిగా బ్రతుకుతూ గురుసహస్రావధాని అయ్యారు. ఎన్నో పద్యకావ్యాలు రచించారు. వాటితోబాటు మనజాతి, గాండీవం వంటి వచన గేయాలు కూడా రచించి ప్రచురించారు. వారిబాటలోనే నడుస్తూ, నేనూ అవధానినయ్యాను. మలయమారుతమనే పద్యకావ్యాన్ని రచించాను. ఇప్పుడు ఇదిగో ఈ నేస్తం వచన కవితా సంపుటిని సాహితీలోకానికి అందిస్తున్నాను. పెద్దలారా! ఆశీర్వదించండి. మిత్రులారా! వెన్ను తట్టండి. అంతే. అంతకంటే కవిగా నేను కోరుకొనేదేముంది.

మా నాన్నగారి ప్రభావంతో మా తల్లి మీనాక్షి పద్యకవయిత్రియై జేగంట అనే కృతిని అందించింది. తమ్ముడు శ్రీవిరించి అవధాని అయ్యాడు, శ్రీవిరించి శతకం, ఆవలిగట్టు అనే పద్య, గద్య కృతులను లోకానికి అందించాడు. సరే! నేనూ అవధానినయ్యాను, కవినై రెండవ పుస్తకాన్ని అందివ్వగలుగుతున్నాను. ఎందరో శిష్యులను తయారుచేయడమే కాక మా కుటుంబం మొత్తాన్ని కవికుటుంబంగా తయారుచేసిన నాన్నగారే నా ఈ కృతిని అందుకోవడానికి అర్హులని నాకనిపించింది. అందుకే ఈ నేస్తాన్ని నాన్నగారికే అంకితం చేస్తున్నాను.

నన్ను చిన్ననాటినుండి ఎన్నోవిధాలుగా ప్రోత్సహించిన బంధుమిత్రులలు హితులు సన్నిహితులు అందరికీ ధన్యవాదాలు.

కడిమిళ్ళ రమేష్

# 1. మైలురాయి

పాతికేళ్ళ వయస్సనెడి
మైలురాయి నధిగమించి
కదులుతోంది జీవితం
కరుగుతోంది జీవితం

చిన్ననాటి జ్ఞాపకాల
గువ్వపిల్ల స్వేచ్ఛకోరి
ఎగిరివెడలి పోయింది
ఎదను విడిచిపోయింది

అమ్మ నాన్న ప్రేమ అనెడి
ముని వాటిని పెరిగినట్టి
బాల్యమనే జింక పిల్ల
స్వార్థ జనారణ్యమందు
మసల లేక బ్రతుకలేక
తిరిగి వెళ్ళిపోయింది
నన్ను విడిచిపోయింది

సప్తవర్ణ శోభితమై
ఆకసాన రంగులీను
యౌవనమను ఇంద్రధనువు
వచ్చి మాయమయ్యింది

పగలు రేయి నవ్వింది
తెలుపు నలుపు మిగిలింది

## 2. బాల్యం

పగలంతా ఆటలాడి
సంజవేళకిల్లు చేరి
గోరు ముద్దలారగించి
అమ్మ ఒడిని తలను వాల్చి
తేనెకన్న తియ్యనైన
అమ్మ జోలపాటలోన

ఆట మరచి అలుపు మరచి
అద మరచి జగం మరచి
మెలమెల్లగ మెలమెల్లగ
నిదురలోకి జారుకున్న
సంగతెంత మధురం
ఆ సమయమెంత మధురం
జోల ఎంత మధురం
ఆ బాల్యమెంత మధురం

సాయంత్రం నాన్న తిరిగి
ఇల్లు చేరుకునే వేళ
అడుగు సవ్వడేదైనా
అలికిడి ఏ మాత్రమైన
అమ్మ చీరకొంగు వీడి
అటు వైపుకు పరుగుతీసి
కనులముందు కదులుతున్న
రూపు నాన్నదౌతుంటే
గుమ్మానికి ఆని అమ్మ
విస్తుపోయి చూస్తుంటే

రెండు చేతులల్ల చాచి
ఎదురొచ్చే నన్ను చూసి

ఆకసానికెత్తి పట్టి
లేతదైన బుగ్గపైని
నాన్నముద్దు పెట్టినంత

గుచ్చుకున్న మీసాలకు
లేతబుగ్గ కందువేళ
సంగతెంత మధురం
ఆ స్పర్శ ఎంత మధురం
ముద్దు ఎంత మధురం
ఆ బాల్యమెంత మధురం

## 3. ఆశావాదం

నిరాశ వలదోయ్
నిస్పృహ వలదోయ్
నీరస భావం అసలొద్దోయ్

ప్రగతిని చూపే
ప్రభాతమునకై
పడమటిదిక్కున వెతకొద్దోయ్

తెలివిని బలిమిని హరింప చేస్తూ
మనలో విలువలు నశింప చేసే
వ్యసనరాజి కడకేగొద్దోయ్
చీకటి దారుల మసలొద్దోయ్

కాలం నీకై
నిముషం ఆగదు
సోమరుపోతువు కావొద్దోయ్
వ్యధగా కాలం గడపొద్దోయ్

ఎంత చేసినా ఫలితం లేదని
ప్రతిభ చూపినా ఫలం శూన్యమని
అధైర్య పడకోయ్, కలవర పడకోయ్

లోకం మారదు
తీరూ మారదు
గుణ దోషాలను వెతొకొద్దోయ్
వేలెత్తికరిని చూపొద్దోయ్
అవమానాలు - ఛీత్కారాలు
జీతం గీతం ప్రక్కన పెట్టోయ్

చరిత్ర గతినే మార్చిన వారు
లోకం రీతిని చదివిన వారు
సాంఘిక ధార్మిక చైతన్యానికి
పునాది రాళ్ళను వేసినవారలు
స్థిత ప్రజ్ఞులు, పూర్ణయశస్కులు
త్యాగమూర్తులు, ధర్మనిరతులు
మహానుభావులు, మహాత్ములంతా
పడలేదటవోయ్ అవమానాలు
పొందలేదటోయ్ ఛీత్కారాలు
చివరకు ఎవరోయ్ గెలిచింది
భవితకు మార్గం చూపింది

## 4. ఓదార్పు

ఏమైంది నేస్తం
ఎందుకలా దిగాలుగా ఉన్నావ్
అమ్మా నాన్న గుర్తొచ్చారా!
నీ మనసెవరైనా నొప్పించారా!

ఎందుకంతలా బాధపడుతున్నావ్
నీ అహాన్ని ఎవరైనా దెబ్బతీసారా
నీ ప్రేమను కాదన్నారా!

కనులెందుకలా చెమ్మగిల్లుతున్నాయ్
నీ స్నేహాన్ని స్వార్థమన్నారా
నీ స్వేచ్ఛని అవకాశవాదమన్నారా

ఎక్కడికి నేస్తం
రోదసిలోని ఏదో గ్రహంనుంచి
విరిగిపడిన గ్రహశకలంలా
వేడి నిట్టూర్పులు విడుస్తూ
శూన్యంలో ఎంత కాలమలా ప్రయాణిస్తావ్

ఎవరున్నారని ఆ వైపు
ఎవరిస్తారని ఓదార్పు

## 5. అశాంతరాగం

ప్రపంచమంతా ఏకకంఠంతో
ఆలపిస్తోంది అశాంతరాగం
నిస్సహాయ శ్రుతిలో
నిర్వేద స్థితిలో

ఉగ్రవాదపుటుచ్చుల్లో
చిక్కుకున్న శాంతికపోతం
రెక్కల అఙ్టులు చాస్తూ
జాలిగా చూస్తోంది
స్వేచ్ఛాకాశం వైపు

అర్థంలేని అర్థాన్వేషనలో
తీరికలేని యాంత్రిక జీవనంలో
నిస్సారంగా బ్రతుకులు తెల్లారిపోతున్నాయ్
నిరాశల చీకట్లలో

ఎదఎదలో అభద్రతా భావం
కారుమబ్బుల్లా క్రమ్ముకుంటున్నాయ్

ఉద్వేగాలతో విద్వేషాలతో
మూర్ఖత్వాలతో మూఢ నమ్మకాలతో
మనుషుల మనసులు మరిగిపోతున్నాయ్

కులమత భాషా ప్రాంత విభేధాలతో
కుటిల నీతుల స్వార్థ ప్రయోజనాలతో
గుండె గదులు కుచించుకుపోతున్నాయ్

మనిషి మనిషినీ దూరం చేస్తూ
మనసు మనసునీ కలుషితం చేస్తున్నాయ్

## 6. నేను

బరువు బాధ్యతల కావడి కుండలు
అహోరాత్రాలు భుజానదాలిచి
విరామమెరుగక స్వలాభమరయక
కడుపు కట్టుకుని వెతలు తట్టుకుని

రెక్కల కష్టం కనపడనీయక
డొక్కల చప్పుడు వినపడనీయక

అడిగిన దానికి కాదని పలుకక
ఇచ్చిన దానికి ప్రతిఫలమడుగక

ఎదలను కలచే వ్యధలెన్నున్నా
ఇంటా బైటా వెతలెన్నున్నా

ఇంచుక ధైర్యం సడలగనీయక
కించిత్ దైన్యం దరి రానీయక
చిరునవ్వెన్నడు చెదరగనీయక

ఉడుగర అడుగని ఊడిగమ్ముతో
ప్రతిఫలమడుగని బంగరు ఎదతో

వరమై దక్కిన క్షమాగుణంతో
మాటల చేతల మంచితనంతో

అమ్మ నాన్నయై - అక్క చెల్లియై
అన్నదమ్ములై - బంధుమిత్రులై
జ్ఞానాన్నొసగే గురుపరంపరై
విలువల బ్రతుకును బ్రతికేవారికి

బ్రతుకు తీపిరుచి తెలిసిన వారికి
బ్రతుకుటకర్థం తెలిసిన వారికి
కొడుకుని నేను
అన్నను నేను
తమ్ముడు నేను
బంధవు నేను

మిత్రుడు నేను
శిష్యుడనేను
కవితా వనితకు ప్రియుణ్ని నేను

## 7. సహసమూర్తి (స్త్రీ)

తరతరాలుగా
యుగయుగాలుగా
సహనమూర్తిగా అభివర్ణించిన
స్త్రీజాతికి ఒరిగిందేమిటి
సహనానికి ప్రతిఫలమేమిటి

ప్రేమ పేరుతో,పెళ్ళి పేరుతో
కళాశాలలో, ఉద్యోగాల్లో
ఇంటా బైటా ఒకే రీతిలో
అవమానాలు అనుమానాలు
పరాభవాలు ప్రాణహానులు
ఆరళ్లు బలవన్మరణాలు

బాల్య వివాహపు దుర్మార్గాలకు
కన్నీరింకా యింకకముందే

సతీసహగమన సజీవ దహనపు
చితి మంటలు చల్లారక ముందే

సభ్య సమాజం గర్వించేలా
మగమృగాలు మరలా విరుచుకుపడితే

అమానుషంగా అకారణంగా
ఆసిడ్ దాడులు చేస్తూవుంటే
నిండు ప్రాణములు తీస్తూవుంటే..

ఇంకెన్నాళ్లు సహించాలి
ఇంకెన్నాళు భరించాలి

సహనమంత్రాన్ని ప్రక్కన బెట్టి
అబల సబలగా మారాలి
అపర కాళియై రావాలి
చేతులు కొడవళ్ళవ్వాలి
చేతలు కనువిప్పవ్వాలి

## 8. సోదరులం

వేల ఏండ్ల గతచరిత్ర ఘనచరిత్ర మనకుంది
త్యాగధనుల ఆశయాలు నెరవేర్చే భాధ్యతుంది

అన్నలార తమ్ములార
వద్దు మనకు తగువులాట
కలసినడచు కాలంలో
పట్టవద్దు వేఱుబాట

కుటిల రాజకాయాలకు కొమ్ముమనం కాయాలా
మంచి చెడులు విడిచి పెట్టి మనం తగువులాడాలా

స్వలాభానికో మనుగడ కొరకో
ఓట్లకోసమో పదవుల కొరకో
విద్వేషాగ్నికి ఆజ్యంపోస్తూ
ఉద్వేగాలకు ఊపిరిపోస్తూ

మనలో మనకే తగవులు పెడుతూ
మానవత్వమును మంటగలుపుతూ

పబ్బం గడిపే దురాగతానికి
విషాన్ని గ్రక్కే దుర్మార్గానికి

ఇంకా వంతను పాడాలా
మన ప్రాణాన్నే బలిచేయాలా

అన్నలార తమ్ములార
వద్దు మనకు తగవులాట
కలసినడచు కాలంలో
పట్టవద్దు వేఱుబాట

వేల ఏండ్ల గతచరిత్ర ఘనచరిత్ర మనకుంది
త్యాగధనుల ఆశయాలు నెరవేర్చే భాధ్యతుంది

చేయి చేయి విడువకండి
భాధ్యతలను మరువకండి

మనం మనం సోదరులం
భరతమాత ఔరసులం

పరస్పర్వం పగలువిడిచి
కలసిమెలసి జీవిద్దాం
ప్రగతిదారి పయనిద్దాం

సౌజన్యం సౌభాగ్యం
వెలుగులీను తెలుగుదనం
జగమంతా చాటిద్దాం
సర్వస్వం ధారపోసి
ప్రాణాలను పణంపెట్టి
సాధించిన స్వారాష్ట్రం
మహనీయుల త్యాగఫలం
మాకేదని ముందుతరం
దీనంగా ప్రశ్నిస్తే
బదులిమ్మని నిలదీస్తే

ఏమని సముదాయిద్దాం
సమాధాన మేమిద్దాం
చేయి చేయి విడువకండి
భాధ్యతలను మరువకండి

# 9. పద్యం

జ్ఞాన ప్రదాతయైన
శబ్ద బ్రహ్మకు
శాశ్వత సుందర
సువర్ణ పద్మాసనం పద్యం

అన్నంరుచి
తెలిసిన వానికి
షడ్రసోపేత భోజనం పద్యం

జరామరణాలు దూరంచేసి
శాశ్వతునిగా, చిరంజీవిగా
మార్చే అమృతభాంఢం పద్యం

అడ్డగోలు వాగ్ధారకు
అడ్డుకట్ట పద్యం
గతితప్పిన భావాలకు
ఆనకట్ట పద్యం

నన్నయాది ఆంధ్రకవుల
కాటపట్టు పద్యం

సత్తా గల తెలుగువారి
సొత్తుసుమా ఈ పద్యం

## 10. ఎందుకు

కదిలించని కవిత్వమెందుకు
కరిగించని గానం ఎందుకు

వర్షించని మేఘం ఎందుకు
హర్షించని బంధువులెందుకు

గతి చూపని చరిత్ర ఎందుకు
వరమీయని దైవం ఎందుకు

నెరవేరని ఆశయమెందుకు
బదులీయని ప్రశ్నలెందుకు

కదిలించని కవిత్వమెందుకు
కరిగించని గానం ఎందుకు

## 11. ఉద్యోగాలు

ఆటపాటగా చదువు చదువుకుని
డిగ్రీ పట్టా చేత బట్టుకుని
ఉద్యోగానికి ఊరొదిలొస్తే

చదివిందొకటి - చేసేదొకటి
జీతమ్మొకటి - పనితీరొకటి

ప్రొద్దుట నిద్దుర లేచుట మొదలు
నడిచే అడుగే పరుగౌతుంది
పరుగుల బ్రతుకే మొదలౌతుంది

వెళ్తూ వస్తూ - వస్తూ వెళ్తూ
నిరాశ తోటీ       నిస్పృహ తోటి
బ్రతుకు భారాన్ని మూపునమోస్తూ
చేసిన పనినే మరలా చేస్తూ
గాడిని తిరిగే గాను గెద్దులా
వృత్తాకారపు చిరు ఉద్యోగుల
జీవన గమనం చూస్తున్నా
బ్రతుకు తీరు గమనిస్తున్నా

అయిదారంకెల జీతంవున్నా
లోకాన్నెరిగే లౌక్యంవున్నా
తనుచేస్తున్నది ఉద్యోగాన్నో
కాకుంటే మరి బానిసతనమో
సరిపోల్చుకునే సమయం లేక
తేల్చుకునేందుకు తీరికలేక

ఆఫీసుల్లో అద్దెకొంపలో
బాసులమధ్య - బాధలమధ్య

దివారాత్రములు గడిపేస్తూ
నిరాశ తోటి నిస్పృహతోటి
ఒక్కరీతిగా బ్రతికే జనాల
బ్రతుకుతీరు గమనిస్తున్నా
జీవితచిత్రం చూస్తున్నా

# 12. కార్పొరేట్ కల్చర్

ఉపయోగించుకోవటం
వాడుకోవటం
అనే రెండు పదాలూ
సమానార్థంలో వాడబడే
కార్పొరేట్ కల్చర్‌లో
మనిషికీ మెషీన్‌కి
అట్టేతేడా కనిపించదు

ప్రతిభకు ప్రశంస
ఆలోచనకు అస్కారం
ఎడారిలో నీటి జాడలా
చాలా అరుదుగా కనిపిస్తాయ్

మనీకి తప్ప మరి దేనికీ
ఎంత వెతికినా వాల్యూ దొరకదు

ఏ రిసోర్స్‌నైనా వాడుకోవాలంటే
మనిషి తర్వాతే - సృష్టించిన భగవంతుడైనా

అవును నిజం
కడుపులో చల్ల కదలకుండా
A.c గదిలో కూర్చుని ఉద్యోగం చేసుకుంటున్నాడని
ఇంట్లో అమ్మ మురిసిపోవడం తప్ప
అసలు విషయం లోపలికి వెడితేగాని తెలీదు
A.c లు మాకోసం కావు మెషీన్ల కోసమని
కూర్చునేవి కుర్చీలుకావు

మెత్తటి కుషన్స్వుండే నిప్పులకుంపటులని
అయిదంకెల జీతగాళ్ళమని
బైట గొప్పగా చెప్పుకోవడమేగాని
ఆరాతీస్తేగాని తెలీదు
మా వల్ల యాజమాన్యం పొందిన లాభంలో
వందవవంతుకూడా మాకు దక్కదని

## 13. యోగం - భోగం

స్వర్గలోకమున నివాసముండే
అప్సరాంగనలు సెలవుతీసుకుని
భూలోకం తమ విడిది చేసుకొని
పువ్వులు విడిచి మొబైల్ఫోనులు
అందంగా అరచేత పట్టుకుని

ఆడహంసలే అసూయ చెందే
సొగసరి గడుసరి అడుగులు వేస్తూ

కను బొమలను పూవిల్లుగ చేసి
కొనచూపులనే తూపులతోటి

అకారణంగా అనాయాసముగ
వచ్చేపోయే పురుషజాతిపై
చూపుల తూపులు విసురుతువుంటే

కుబేరులైనా గులాములనరా
మన్మధులైనా మోకరిల్లరా

సన్యాసైనా సన్యసించడా
యోగం భోగం కాకమానునా

# 14. ద్వంద్వం

సత్యమసత్యం
ధర్మమధర్మం

పాపం పుణ్యం
స్నేహం ద్వేషం

లాభం నష్టం
త్యాగం స్వార్థం

ఆశ నిరాశలు
గెలుపోటములు

దివారాత్రములు
సుఖదుఃఖాలు

కలదు కలండను ఆస్తికవాదం
లేనే లేడనే నాస్తిక వాదం

ఆకలి కేకల ఆరని శోకం
తిన్నది అరుగని అజీర్తిరోగం

ఆలోచిస్తే ఆరాతీస్తే
తెలిసిందొకటే తేలిందొకటే

ద్వంద్వాలకు అధీనమై సాగుతోంది సమస్తం
స్పందిస్తూపోతుంటే చాలదు ఒక జీవితం

## 15. లోకం - లౌక్యం

అందిందంటే జుట్టు పట్టుకుని
అందంకపోతే కాళ్ల పట్టుకుని
అవసరానికో రంగును మార్చే
ఊసరవెల్లుల లోకంబాబూ
లోకం ఎరుగని లౌక్యంబాబూ

తోడివారిలో దోషగుణాల్నే
మాటి మాటికి నెమరును వేస్తూ
అహేతుకంగా - అమానుషంగా
విసపు నవ్వుల నురుగుల గ్రక్కే
ద్విపాద పశువుల లోకం బాబు
బండలు బారిన గుండెలు బాబు
గుండెలు తీసిన బంటలు బాబు

ధనార్జనొకటే పరమార్థంగా
స్వలాభ దీక్షా కంకణధరులై

ప్రక్కవాడు కన్నీరుపెట్టినా
గోడు చెప్పి గగ్గోలు పెట్టినా
కరుగని కఠినపు హృదయం బాబు
కరుగని కఠినపు గుండెలు బాబు
బండలు బారిన గుండెలు బాబు

నవ్వే వాడిని నవ్వనివ్వదు
ఏడ్చే వాడిని ఏడ్వనివ్వదు

ఎదిగే వాడిని చూసిఓర్వదు
ఓడిన వాడికి ఊతమివ్వదు

## 16. ప్రేయసి

నువ్వు దూరంగా చందమామలా
నా మనసిక్కడ చంటిపాపలా
నువ్వు కావాలని మారాంచేస్తూ
తీసుకురమ్మని వేలుచూపుతూ

ఎంత సేపు నే బుజ్జగించినా
ఎన్ని విధాలుగ నచ్చచెప్పినా

తనలో ఏదో ఆరాటం
నాతోనే తన పోరాటం

నువ్వు కనిపించని ప్రదేశమంతా
ఎడారి తీరుగ కనిపిస్తుంటే
ప్రతిచోటా నీరూపు రేఖలే
నీటి జాడలై కదులుతు ఉంటే

నేనంటున్నా ఎండమావి అని
మనసంటోంది ఒయాసీస్సు అని

అందని జాబిలి నీవైనా
నీ వెన్నెల నాదే అనుకున్నా

నువ్వు కనిపించక అది పగలైనా
అంతా చీకటి చూస్తున్నా
పగలంతా గడిపేస్తున్నా
సాయంత్రం నిను చూస్తానని !

కనుపాపకు జోకొడుతున్నా
కలనైనా కనిపిస్తావని !

# 17. కవి - అహంకారం

ఒక రోజు నాతో అన్నాడొక పెద్దమనిషి
కవులంతా అహంకారులని
అందరిదీ అహంభావమని
ఎవరూ అతీతులుకారని
తనకే మాత్రం నచ్చరని

అతని అవగాహనా రాహిత్యానికి
సంకుచిత భావోద్వేగానికి
ఆనాడు మారుపలుక లేదు
ఈనాడు బదులు చెప్పదలచుకోలేదు

అసలు నిజానికి
అర్హత ఉన్నవారికి అహంకారం కూడా అలంకారమే
స్వాభిమానం సర్వధా సర్వజన సమ్మతమే

వాణి నా రాణి అనగలిగే దమ్ము
కవికిగాక ఇంకెవరికుంటుంది

జరామరణాలు లేని
కీర్తి శరీరులై, రసమూర్తులైన
సత్కవులనర్థం చేసుకోవడానికి, విమర్శించడానికి
కవిహృదయం తెలియగల రసజ్ఞుడైయుండాలి

శ్రీనాధుడు విలాస పురుషుడని
విశ్వనాథవారు పరమఛాందసులని
శ్రీశ్రీ చైన్‌స్మోకరని
మరెవరో మరేమిటో అని

వారి వారి అలవాట్లతో గుణదోషాలతో
అంచనా వేయడానికి ప్రయాసపడకు
కులమత ప్రాంతాల చట్రాలలో
బంధించాలని ప్రయత్నించకు

నిరంకుశ కవీంద్రాలను గడ్డిపోచలు బంధించలేవు
పొంగెత్తే వరదగోదావరిని ఏటిగట్టులాపలేవు

సుగంధమో దుర్గంధమో
నువు నిలబడ్డ ప్రదేశానికిగాని
మోసుకు వచ్చే గాలికి ఆపాదించకు

## 18. చక్రభ్రమణం

తలచేదొకటి
జరిగేదొకటి
జరిగిన దానికి ఫలమింకొకటి

తనవారెవరో
పగవారెవరో
తనవారనుకొను పగవారెవరో
పగవారనుకొను తనవారెవరో

కల్ల నిజంబులు తేలేలోపే
జరిగే నష్టం జరిగేతీరును
విసిగిన మనస్సు విరిగే పోవును

# 19. హేతువు

నిస్సారపు సంసార జలధిలో
చర్విత చర్వణ జీవనమ్ములో
ఇన్నాళ్లు నేనన్వేషించిన

సుఖాల దీవిని కనుగొన్నా
సారమేమిటో పసిగట్టా
ఆనందపు హేతువు కనిపెట్టా

ధూమపానమో సురాపానమో
ఏముందందున పట్టి నిషా
సుఖముందన్నది మృషా మృషా
వ్యసన బానిసల కట్టు కథ
నిషాదిగిందో మొదలు కథ

సొగసరి గడుసరి పూబంతుల
అధర పాత్రమున సుధాపానమో
స్తనయుగ పర్వత అధిరోహణమో
స్మరకేళీజిత సరస జగమ్మో

విషయ లాలసుల వృధా వాదన
నిరంకుశ కవిజన అతిశయ కల్పన

ప్రాపంచికమో, పారమార్థికమొ
నానేర్చిన ఆనందాలవి రెండే రెండు
రసానందము
సదానందము
రసానందము
కవిత్వముంది
సదానందమా
ఏకాంతంవుంది

## 20. కథ - వ్యథ

దింపుకోలేని బరువులతో
బైట పడలేని బాధ్యతలతో
ఆర్థిక ఇబ్బందులతో
ఆరోగ్య సమస్యలతో
సతమతమవుతున్న -- ఓ సంసారి!

గుర్తించని యాజమాన్యపు
గొంతెమ్మ కోరికలతో
ఊపిరాడని ఒత్తిళ్ళతో
చాలీచాలని జీతాలతో
విసిగి వేసారతున్న -- ఓ ఉద్యోగి

అర్థం పర్థం లేని
రిజర్వేషన్ల కోటాల్లో
తన వాటాగా మిగిలిన
ఒకటిరెండు పోస్టులకు
వందల వేలమందితో
పోటీ పడలేక
నిరాశతో నిట్టూరుస్తున్న -- ఓ నిరుద్యోగి

కాయకష్టంతో కడుపునింపుకుని
ప్రతి అయిదు సంవత్సరాలకొకసారి
పుట్టినరోజు జరుపుకుంటూ
తన అస్తిత్వాన్ని నిలుపుకునే
రెక్కాడక డొక్కాడని -- ఓ బడుగుజీవి

కథ ఒకటే సినిమాలే వేలు
వ్యథ ఒకటే కారణాలు వేలు
ఎటుచూసినా ఎవరిని కదిపినా
అదే కథ - అదే వ్యథ

# 21. నేస్తం

వింటావా చెపుతా నేస్తం
అణు మాత్రం లేదు అసత్యం

కమ్మని నీ పలకరింపులో
చల్లని నీ కనుచూపులో
ఏ స్వార్థం లేని మైత్రిలో

మైమరచా ఎన్నో రోజులు
నే మరచా అమ్మా నాన్నను

మన ఇరువురి పోట్లాటలలో
కనిపించని కారణాలలో
గెలిచిందీ ఓడిందెవరో

ఏ జన్మల చేసిన పుణ్యం
వరమెందుకు ఇచ్చెను దైవం !

లోపాలు గుణ దోషాలు
చేయలేవు మైత్రిని మలినం

చెపుతున్నా విను ప్రియనేస్తం
ఏ మాత్రం లేదు అబద్ధం

నీ రూపం - నీ దరహాసం
నీ చేరువలో గడచిన సమయం
నీ పంచిన మధుర స్నేహం
ఎద లోతుల పదిలం పదిలం

సాక్షి ఫ్యామిలీ | తాడేపల్లిగూడెం | శుక్రవారం | మే | 3 | 2013 | www.sakshi.com

# సాఫ్ట్‌వేర్ అవధాని



కడిమిళ్ల రమేష్

**నేటి యువత మనసంతా సాఫ్ట్‌వేర్ వైపే. పశ్చిమగోదావరి జిల్లా నరసాపురానికి చెందిన రమేష్ కూడా ఇందుకు భిన్నం కాదు. ఎంసిఏ చదివి సాఫ్ట్‌వేర్ ఉద్యోగం చేస్తున్నాడు. కానీ... తెలుగంటే మక్కువ... తెలుగులో ప్రత్యేకంగా ఎం.ఏ చేయకపోయినా ఛందోబద్ధంగా కవిత్వం రాస్తున్నాడు. అవధానాలలో అలవోకగా పద్యాలు అల్లుతున్నాడు. అవధానిగా ప్రసిద్ధులైన తండ్రి కడిమిళ్ల వరప్రసాద్, తెలుగు అధ్యాపకురాలిగా విద్యను బోధిస్తున్న తల్లి కడిమిళ్ల మీనాక్షి దంపతుల కుమారుడు రమేష్‌తో ముఖాముఖి...**

**అవధానంలోకి ఎలా ప్రవేశించారు?**

'చదువది ఎంత గల్గిన రసజ్ఞత ఇంచుక చాల కున్న ఆ చదువు నిరర్థకంబు...' అన్నట్లు, చదువుకున్నది ఎంసిఏ అయినా నన్ను రసజ్ఞునిగా మలచినది మాత్రం కవిత్వం. అందునా పద్యకవిత్వం.

**అవధానిగా సాగుతున్న ఈ ప్రస్థానానికి మూలాలు ఎక్కడ?**

నాన్నగారి దగ్గర పద్యకవిత్వంలో ఓనమాలు నేర్చుకున్నాను. కవిని, అవధానిని కావడం వెనుక ఎంతోమంది ప్రోత్సాహం ఉంది. ప్రత్యక్షంగా తల్లిదండ్రులు కారణమైతే పరోక్షంగా గురువులు, తమ్ముడు శ్రీవిరించి, బంధువులు, స్నేహితులు...

**కవిత్వం ఎవరి ప్రేరణ?**

నాలో కవితాసక్తిని నింపినది నాన్నగారైతే, కవితాశక్తిని బయటకు తీసింది మా అమ్మగారు. నన్ను కవిగా మలచినది నాన్నగారైతే, ఆ కవిత్వం పుస్తకరూపం దాల్చడానికి మా అమ్మగారు కారణం.

**మీ తమ్ముడి ప్రభావం ఎంతవరకు ఉంది?**

కవిని అవధానిగా మార్చినది నాన్నగారైతే, నన్ను ఆ సాహసానికి సన్నద్ధం చేసింది తమ్ముడు ఇచ్చిన ఉత్సాహమే. లబ్ధప్రతిష్ఠులైన నేటితరం అవధానులలో కొందరు నాన్నగారి శిష్యులు, మరికొందరు మిత్రులు కావడంతో, వారితో నాకు సాన్నిహిత్యం కలిగింది. తమ్ముడు కూడా నాన్నగారి దారిలోనే అవధాన విద్యను అభ్యసించి అవధానిగా రాణించాలని ఎంతో కృషి చేస్తుండడం... ఇవన్నీ నాలోని ఉత్సాహాన్ని రెట్టింపు చేశాయి.

**నాన్నగారితో చేసిన అవధానం గురించి చెప్పండి...**

గత సంవత్సరం నాన్నగారితో కలసి జంటగా రెండు అవధానాలు చేసి అవధానిగా నా కలను సాకారం చేసుకున్నాను.



తండ్రితో కలిసి అవధానం చేస్తున్న రమేష్

**మీ తొలి రచన ఏమిటి?**

'మలయమారుతం' అనే పద్యఖండకావ్యం. ఆ రచనకు పెద్దల మన్ననలతో పాటు...

**వడివడి నిద్రలేచి, భగవంతునిపై ఒక నిందవేసి, భక్తుడు వలె పూజ చేసి, సరికొసము గాలము వేసివేసి, సాగెడి నరకాగసీత వరుగే వనిగా వని వేసివేసి, ఓ త్రిదులకు ఐద్రవాని ఇక తీయరె నిద్దుర రాత్రి వేళలన్**

అనే పద్యానికి అవార్డు వచ్చింది.

**నాన్నగారితో చేయడంలో మీకు కలిగిన అనుభూతి...**

ధార, ధారణ సాధారణంగా అవధానికి ఉండే లక్షణాలు. ఈ రెండూ నాన్నగారి విషయంలో అసాధారణంగా కనిపిస్తుంటాయి. అటువంటిది నాన్నగారితో కలసి అవధానం చేయగలిగానంటే అది ఆయన సంకల్పబలం, రసజ్ఞుల సౌజన్యం కారణం. కాకినాడలో నా మొదటి అవధానం జరిగినప్పుడు, ''అవధానిగా మీకిది తొలి అవధానం. అందునా మీ నాన్నగారితో. దీనిపై ఆశువుగా వారి మీద పద్యం చెప్పండి'' అని అడిగినప్పుడు... **''నాకిది తొలి అవధానము నాకొను**

**ప్రత్యక్షరమును ప్రాణము తండ్రె చేకొని తేగొని**

**నన్నున్ ప్రాకెడి పసిపిల్లవాని పేరిగెత్తించెన్''**

అని బదులిచ్చాను. నాన్నగారితో అవధానమంటే నల్లేరుపై నడకలాంటిది. అందుకే నా అవధాన ప్రారంభంలో దైవప్రార్థనతో పాటు ఈ కింది పద్యాన్ని కూడా చెప్తూ ఉంటాను.

**''భారతి సుతుదగు జనకుం**

**దారయ నా ప్రశ్నమంద అమరెడి జయముల్**

**సారథి కృష్ణుండగునెడ**

**భారత సంగ్రామమందు పార్థునికి వలెన్''.**

**ఇంకా మీ ఇతర రచనల గురించి...**

ఉద్యోగం పేరు చెప్పి, కన్నవారిని, ఉన్న ఊరిని, స్నేహితులని అన్నీ వదిలి, పట్నం చేరుకుని, ఇక్కడి పరిస్థితులను చూసి, మనసుండబట్టక **''చాల దుర్భరమోయి పట్నాల బ్రతుకు''** అనే మకుటంతో రచన ప్రారంభించాను. అది పూర్తి కావచ్చింది. పిదప ఆ కవితాకన్యకకు వరాన్వేషణ చేయాలి.

**వచన కవిత్వం గురించి...**

బాలగంగాధర తిలక్ 'అమృతం కురిసిన రాత్రి' శ్రీశ్రీ 'మహాప్రస్థానం' సినారె 'విశ్వంభర', నిన్నటికి మొన్న నాన్నగారు రచించిన 'గాండీవం' నాలో ఉత్సాహాన్ని రెట్టింపు చేసి, వచన కవిత్వంపై మక్కువ పెంచింది. ఆ రచన పుస్తక రూపం దాల్చాల్సి ఉంది. కవిత్వమనేది రసప్రధానంగా ఉండాలి. సమసమాజానికి అద్దం పట్టేలా ఉండాలి. అప్పుడే అది కాలానికి నిలబడుతుంది. ఆదే నిజమైన కవిత్వం అని నా ఉద్దేశం.